'సూర్యుడెందుకు ఉదయిస్తాడు?' అనే ప్రశ్నకి 'ఉదయించాలి కాబట్టి' లేదా, 'నేను ప్రొద్దున్నే లేవాల్సిన సమయం తెలియదానికి' అన్న సమాధానాలు బోల్డంత సంతృప్తి కల్గిస్తాయి. 'సూర్యుడు ఎందుకు అస్తమిస్తాడు?' అన్న ప్రశ్నకి, 'అల్సిపోతాడు కాబట్టి' అనో 'నేను నిద్రపోవాలి కదా మరి' అనే సమాధానాలు మనం ఎదురు చూడవచ్చు.

సింప్లిసిటీయో లేదా, ప్రపంచంలో ఏదైనా 'తమ అనుకూలం కోసమే' అనే భావన వారికి బాగా నచ్చుతుంది. 'వానా వానా రావమ్మా, నన్ను తడిపి పోవమ్మా' అని ప్రకృతిని కమాండ్ చేయడంలో వున్న ఆనందం ఇంత పెద్ద ప్రపంచంలో ఓ చిన్న పిపీలికం మనిషి అన్న పచ్చినిజం రియలైజ్ చేయడంలో రాదు. కానీ ఈ సూడో - అమాయకత్వంలో వుండడంవల్ల మన పవర్ మనకు తెలిసే అవకాశం లేదు.

నిజాలు అర్ధమయ్యేకొద్దీ, ఒక రకమైన అయిష్టత పెరుగుతూ వుంటుంది. మనం పట్టించుకోకుండా అమాయకంగా వుండాలనుకునేకొద్దీ ఆ అయిష్టత పెరుగుతూ వుంటుంది. అందుకే మన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలి. స్వేచ్ఛగా, స్వతంత్రంగా బ్రతకడంలో వున్న ఆనందాన్ని డిస్కవర్ చేయాలి. అలా చేయగలగాలంటే, మనం మన అమాయకత్వం ముసుగునుంచి బయటపడాలి. ఇది మనకు చాలా సంక్లిష్టమైన వ్యవహారంలా కన్పించవచ్చు.

పరిస్థితుల్ని మరింత విషమం కాకుండా కాపాడుకోగలగడంలో మన లౌక్యం, మన తెలివితేటలు బయటపడతాయి. ఇదంతా కష్టమే అయినా, చెత్త సిద్ధాంతాల్ని నమ్మటం వల్ల కలిగే నిస్పృహ, క్షోభ అంత బాధాకరం మాత్రం కాదు.

కొంత సూడో - ఇన్నోసెన్స్‌తో కొంతమంది పెద్ద వేదాంతుల్లా, అన్నీ త్యజించిన మహర్షుల్లా ఫోజిచ్చేస్తూ వుంటారు. ఇలా కన్పించడానికి వాళ్ళు జీవితంలో అతి చిన్న చిన్న ఆనందాలకు కూడా దూరమవ్వాల్సొస్తుంది. దానికి సిద్ధంగా లేని పక్షంలో మరింత అభాసుపాలయ్యే ప్రమాదం వుంది.

మనం చేసే ప్రతి పని వెనుక కారణాలు వెదుక్కోవడం చాలా అవసరం.

మనం చేసే పనులన్నిటికీ మూడు స్టేజీలు వుంటాయి.

మొదటి స్టేజీలో - మనకేదో కావాలనో, ఏదో లేదనో అనిపిస్తూ వుంటుంది. ఆ అసంతృప్తి అస్పష్టంగా తెలుస్తూ వుంటుంది. ఒక పని చెయ్యాలనిపిస్తుంది. అది చెయ్యకపోతే ఇబ్బందిగా వుంటుంది.

ఇక రెండో స్టేజీలో - ఏదో విధంగా మన అవసరాన్ని తృప్తి పరుచుకోవాలనిపిస్తుంది. ప్రయత్నం చేయటం మొదలవుతుంది.

మూడోది - తృప్తి స్టేజి. పనిచేయటంవల్ల కలిగే సంతృప్తి ఇది.

ఈ ప్రపంచంలో చాలామంది మొదటి స్టేజీలో ఆగిపోతారు. ఇంకా చాలామంది రెండో స్టేజీలో ఆగిపోయి బాధపడతారు. కొద్దిమందే మూడోస్టేజి పూర్తి చేస్తారు.

అందుకే ‘ఆరంభింపరు నీచ మానవులు’ అన్నాడు భర్తృహరి.

(అయిపోయింది)